శ్రీః
శ్రీ సీతా రామచంద్ర పరబ్రహ్మణే నమః



శ్రీమతే రామానుజాయనమః.

# సమయోచిత పద్యరత్నావళి.

అనవరత హరికథా బోధనారతులగు
శ్రీమత్తిరునగరి కస్తూరి రంగదాసుగారి
ద్వితీయ పుత్రుండగు

## శేషదాసుగారిచే

సంగ్రహింపబడినది.

రెండవకూర్పు 1000 ప్రతులు.


ప్రకటనకర్త

**కురుకూరి సుబ్బారావు**

సరస్వతీ బుక్కుడిపో

బెజవాడ, కృష్ణాజిల్లా

క. సుబ్బారాయసోదరులచే స్వాస్తిక అండు కో., లో ముద్రింపబడియె.

1928.




వెల 0—6—0

# ఉపోద్ఘాతము.



ఆర్యులారా !

భక్తిరసపూరితములగు హరికథలు శ్రీ మాతండ్రిగారు పలు తావులందు జెప్పుచుండుట నేను బాల్యమునుండియు వినుచుండుటం జేసి నాకును అట్టి కథలు జెప్పవలయునని యుత్సాహంబు బొడమి కొన్ని కథలను నేర్చుకొని చెప్పందొడంగితిని. హరికథ జెప్పుతరి సందర్భానుసారముగా కొన్నిపద్యము లత్యావశ్యకములౌటచే ప్రాచీననవీన కవిపుంగవులచే రచియింపబడిన సత్ప్రబంధములనుండి కొన్ని పద్యములను సంగ్రహించి హరికథలయం దచ్చటచ్చట సందర్భానుసారంబుగా జదువుచుండుట నామిత్రవర్గమందలి కొందరు రసగ్రాహపారీణు లాకర్ణించి నన్నుంగాంచి మిత్రమా! ఇట్టికర్ణానందదాయకంబులగు బద్దెంబు లెల్లరకుం దెల్లంబగునటుల మొత్తంబుగా గూర్చి పొత్తంబుగా నచ్చొత్తించిన సర్వజనోప యుక్తంబుగా నుండునని ప్రోత్సాహంబొసర్చ వారల యాజ్ఞ నొదలందాల్చి సమయోచిత పద్యరత్నావళి యను నామంబున నా నేర్చుకొలది నిందుల పొందుపరచి బ్రచురించినాడను. ఇదియును గాక నా ప్రియమిత్రులగు సోదరులారా ! ఇందుకు సంబంధమగు స్వప్రణీతంబులయినవిగాని లేక ప్రాచీన నవీన కవిప్రణీతంబులగు బద్దెంబులుగాని మీ రెఱింగిన వెవ్వియైన నున్నచో నాకొసంగిన నవి రెండవకూర్పునందు సందర్భానుసారముగా పొందుపరచి ప్రచురింప నుద్యమించియుంటిని. గావున నాయందత్యంత కరుణారసపూర్ణులై నాయుద్యమంబునకు దోడ్పడం బ్రార్థించుచున్నాడను.

ఇట్లు విన్నవించు వినేయుఁడు-
తిరునగరి శేషదాసు.



శ్రీమతే రామానుజాయనమః.

# సమయోచితపద్యరత్నావళి.

శా. శ్రీరామున్ శశికోటి కాంతివదనున్ సీతామనోనాయకున్
ధీరున్ విశ్వగురున్ బరేశు సరయూతీరప్రచారిన్ హరిన్
ధారాభృత్సమనీలుకౌస్తుభధరున్ దాత్రన్ సుపర్ణేశ్వరున్
శౌరిన్ సర్వఫలప్రదున్ గొలిచెదన్ సత్యాత్మసామ్యాకృతిన్. 1

(దశావతార చరిత్ర.)

సీ॥ ఎయ్యది ప్రకృతి విహీనమై సచ్చిదా
నంద నిత్యపరిపూర్ణత వెలుంగు
స్వగతసజాతి విజాతీయ భేదముల్
గాంచు నెయ్యది సర్వకాలమునను
జీవేశ్వరాఖ్యల జెలగు నెయ్యది యవి
ద్యయు విద్యయు నుపాధులై తనర్చు
జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయు దానయై
వర్తించు నెద్ది సర్వంబునందు

గీ. నట్టి వేదాంతవేద్య మా ♦ ద్యంతరహిత
మమలయోగీంద్ర నిష్ప్రపం ♦ చాభిధాన
లక్షలక్షిత మపవర్గ ♦ లక్షణంబు
నైన బ్రహ్మంబు మూర్తమై ♦ యలరుగాత.

(ప్రార్థన-ఉత్తరరామాయణం లోనిది.)

సీ॥ దండంబు శార్ఙ్గకోదండాగ్రకాండప్ర
కాండ ఖండితదైత్య కాండ నీకు
జోహారు మదగజ ద్రోహాగ్రహావహ
గ్రాహచ్ఛిదాహవోత్సాహ నీకు
వందనం బరవింద మందిరామందిర
తుందరోరస్స్థలాళింద నీకు
జేజే మహారాజాది రాజీవపూజాస
మాజోచితాంఘ్రి పంకేజ నీకు
బహు నమస్కారములు చక్ర ♦ పాణి నీకు
నైక సాష్టాంగములు జగ ♦ న్నాథ నీకు
ప్రణుతిశతములు సురసార్వ ♦ భౌమ నీ క
నంతసేవాంజలులు సదా ♦ నంద నీకు. 3

(సీతాదేవి స్తుతి-సీతారామాంజనేయములోనిది.)

సీ. తనరజోగుణముచే దనరంగ నేదేవి
కల్పించు నిఖిల లోకముల నెల్ల
దనసత్త్వగుణముచే నొనరంగ నేకొమ్మ
పోషించు నీసర్వ భూతములను
దనతమోగుణముచే దగ నేవధూమణి
జగముల నెల్ల సంక్షయము జేయుఁ
దాశుద్ధ సత్త్వప్రధానస్థ యై రాము
వామాంకమున నజస్రము వసించు
నట్టి భువనైకమాత ద ♦ యాసమేత
సద్గుణవ్రాత నిస్తుల ♦ స్వాంతపూత
భక్తజనమానసోద్యాన ♦ పారిజాత
సీత కరుణించి మము ర ♦ క్షించుగాత. 4

(శ్రీరామనామమహిమ)

సీ. నిఖిలరోగంబుల నిర్మూలముగఁ జేయు
భవభయంబుల నెల్ల బారద్రోలు
బంధనంబులఁ బటాపంచలుగావించు
నలయునాపదలను నలిమివైచు
శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చు
దూలించు బహువిధ దుఃఖములను
దలఁజూపకుండ దుర్దశలను దొలఁగించు
సకలశుభంబుల సంగ్రహించు
పరమపావన మంగళ ♦ ప్రదముగాన
గలితధర్మార్థ కామమో ♦ క్షములలోన
నెసగు భక్తుల కొసగని ♦ దెద్దిలేదు
యేమిజెప్పుదు శ్రీరామ ♦ నామ మహిమ. 5

(శ్రీ పంచాక్షరీ మహిమ-బ్రహ్మోత్తర ఖండములోనిది.)

సీ. రమణీయతరమంత్ర రాజంబులందెల్ల
నధికమైయొప్పు పంచాక్షరంబు
ఆగామిసంచిత ప్రారబ్ధ పాతక
హరణ కారణము పంచాక్షరంబు
గణుతింప ధర్మార్థ కామ మోక్షములకు
దక్షత నిచ్చు పంచాక్షరంబు
కౌశికాగస్త్యాది ఘనమునీంద్రులు చెల్వు
లక్షణంబరయ పంచాక్షరంబు
జపపరాయణులగు సాధు ♦ జనులకెల్ల
నక్షయఫలప్రదంబు పం ♦ చాక్షరంబు
పూర్వజన్మకృతానేక ♦ పుణ్యసాధ్య
మాగమోక్తంబు శివ పం ♦ చాక్షరంబు. 6

(నిశ్చలసమాధివిషయము - సీతారామాంజనేయములోనిది.)

సీ. వేదశాస్త్రంబులు వివరించి బుధులచే
జదివింపవచ్చు దా జదువవచ్చు
యజ్ఞ దాన తపంబు లధికారిజనముచే
జేయింప వచ్చు దా జేయవచ్చు
నిలలోనగల తీర్థములకేగ నన్యుల
బోధింపవచ్చు దా బోవవచ్చు
నష్టాంగయోగవిద్యలు నార్యులకు నుప
దేశింపవచ్చు సాధింపవచ్చు
గీ. గాని యెవ్వారికైనవి ♦ జ్ఞానయోగ
గతిని దేహేంద్రియము లరి ♦ కట్టిమనము
నాగియంతర్ముఖము జేసి ♦ యనవరతము
నిశ్చల సమాధి నిష్ఠచే ♦ నిలుపరాదు. 7

(రామనామపరులే శ్రేష్ఠులనుట - రామస్తవరాజములోనిది.)

సీ. తెల్లవారగతొల్లి చల్లని నీటిలో
వాయగా నోడదెల్ల ఎడకువారు
నీరుకావులుగట్టి నీళ్ళు దర్భలచేత
సవ్యాపసవ్యముల్ జల్లువారు
బిగుసుగ ముక్కులు బిగియించిగొణుగుచు
మాగన్ను వేయుచు నూగువారు
సాము జేసినయట్లు సాగిలబడిపడి
పొద్దుకెదురుగ నిల్వబోవువారు
గీ. బిరబిరను చెట్లచుట్టును ♦ దిరుగువారు
నేయిచిదుగులు నగ్నిలో ♦ వేయువారు
వైశ్వదేవాదు లొనరించు ♦ వారు రామ
కీర్తనలు జేయువారికి ♦ క్రిందివారు. 8

(వైకుంఠపుర వర్ణన- భాగవతములోనిది.)

సీ. వలనొప్పగా నదైవం కేశవాత్పర
మనిపల్కు రాజకీరావళియును
మహిమ జగద్విష్ణుమయ మఖిలమ్మని
చదివెడి శారికాసముదయంబు
నేపారగా నంతే పుండరీకాక్ష
యనిలీల బాడు పికావళియును
లలిమీరగా మంగళం మధుసూదన
యనుచు బల్కెడు మయూరావళియును
తే. దవిలి క్రొవ్విపద్మషట్పద ♦ త్యాదిశబ్ద
కలితముగ మ్రోయు మధుపని ♦ కాయములును
గలిగి యఖిలైక దివ్యమం ♦ గళవిలాస
మహిమ జెన్నొందు వైకుంఠ ♦ మందిరంబు. 9

(కళాపూర్ణోదయములోనిది.)

సీ. ఘటమంచు బటమంచుఁ గారుయుక్తులరెంచు
దుష్టతార్కికులకు దూరమగుచు
శ్రుతియంచు స్మృతులంచు శుష్కకర్మములెంచు
మీమాంసకుల కప్రమేయమగుచు
ఝరియంచు ఖరియంచు జనుల వీనులనొంచు
శబ్దాకరతుల కసాధ్యమగుచు
మృషయంచు నిషయంచు విశ్వమో క్తిగలహించు
నద్వైతపరుల కప్రియమగుచు
తే. కృష్ణవిష్ణ్వాహ్వయపి కేశ ♦ కేశవయను
భక్తుల కొకప్పుడును దుర్లభంబుగాక
పరగు ప్రకృతి వికారదు ♦ స్పృశ్యతరము
గురుతరానంద ఝరము వై ♦ కుంఠపురము. 10

(శివభక్తి - సానందోపాఖ్యానములోనిది.)

సీ. శివునపేక్షించిన చిత్తంబు చిత్తంబు
భవుకథ లాలించు చెవులు చెవులు
కఱకంఠు బూజించు కరములు కరములు
శ్రీశంభు వర్ణించు జిహ్వ జిహ్వ
గౌరీశుపొడగను కన్నులు కన్నులు
మదనవైరికి మ్రొక్కు నుదురు నుదురు
హరుమందిరము మెట్టు నడుగులు నడుగులు
సర్వేశు జపియించు జపము జపము
గీ. భర్గుగొనియాడనేర్చిన ♦ భక్తి భక్తి
చిన్మయాత్ముని సేవించు ♦ సేవ సేవ
నీలకంధరు దలపోయు ♦ నేర్పు నేర్పు
శర్వమహిమంబు లెన్నిన ♦ చదువు చదువు. 11

(విష్ణుభక్తి - భాగవతములోనిది.)

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి
గీ. దేవదేవుని జింతించు ♦ దినము దినము
చక్రహస్తుని బ్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి ♦ గురుడు గురుడు
తండ్రి హరిజేరుమనియెడి ♦ తండ్రి తండ్రి.

(కర్మవిషయము - భాగవతములోనిది.)

చ. ధనపశు పుత్రమిత్రు వని ♦ దాగృహకారణ భూతమైన యీ
తనువునవున్న జీవుడు ప ♦ దంపడి యట్టి శరీరమెత్తి తా
ననుగతమైన కర్మ ఫల ♦ మందక పోవగరాదు మింటబో
యిన భువి దూరినన్ దిశల ♦ కేగిన నెచ్చటనైన డాగినన్. 13

(భాగవతములోనిది)

క. కర్మమున బుట్టుజంతువు
కర్మమున సమృద్ధిబొందు ♦ గర్మమున జెడుం
గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకు ♦ గారణమధిపా. 14

(భారతములోనిది.)

క. విను కర్మంబనుసరించుచు
జననము మరణంబు నదియు ♦ సౌఖ్యము దుఃఖం
బును గాపించుం దనచే
సిన దానిం జడకపోవ ♦ శిఫ్రునకువశమే. 15

(ఓర్పువిషయము - భాస్కరరామాయణములోనిది)

గీ. క్షమయజనుల కాభరణము ♦ క్షమయకీర్తి
క్షమయధర్మంబు క్షమయ స ♦ జ్జనగుణంబు
క్షమయ యజ్ఞంబు క్షమయ మో ♦ క్షంబు క్షమయ
సకలదానంబు క్షమయందె ♦ జగమునిలుచు. 16

(గోపీనాధ రామాయణములోనిది)

ఆ. వె. క్షమయె భూషణంబు ♦ క్షమయె దానంబు య
జ్ఞంబు సత్యమార్గ ♦ వంబు యశము
తపముశీలమధిక ♦ ధర్మంబు క్షమయందె
నిలిచియుండుజూడ ♦ నిఖిలజగము. 17

(శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణములోనిది)

గీ. క్షమయె దానంబు జన్నంబు ♦ క్షమయె జుండు
క్షమయె సత్యంబు సత్కీర్తి ♦ క్షమయెగాదె
క్షమయె సద్ధర్మములుగాన ♦ గన్యలార
క్షమను నెలకొని యుండెడి ♦ జగములెల్ల 18

(విష్ణుభక్తివిషయము-భాగవతములోనిది)

మ. ఉపవాసవ్రత శౌచశీలమఖ సం ♦ ధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాది కర్మముల మో ♦ క్షప్రాప్తి చేకూర ద
చ్చపుభక్తిన్ హరి, పుండరీకనయనున్ ♦ సర్వాతిశాయిన్;రమా
ధిపు, పాపఘ్ను, బరేశు, నచ్యుతుని, సద్ధీసంగుల్వ లేకుండినన్. 19

(సద్భక్తివిషయము-భాగవతములోనిది.)

మ॥ హరినామాంకిత సత్కథా మృతరస ♦ వ్యాలోలురైనట్టి స
త్పురుషశ్రేష్ఠు డసత్కథా లవణవా ♦ పూరంబు దాగ్రోలునే
వరమందార మరందపాన కుతుక ♦ స్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేదు వేములకు ద ♦ ద్గంధాను మోదాత్మయై. 20

(దుర్మార్గులు.)

చ. వినుతగుణోత్తరుండు మురు ♦ విక్రముడైన హరిన్ భజించి త
న్మనవల సత్కథామృతము ♦ మానుగ గ్రోలుటమానిదుష్కథల్
విని ముదమందుచుందురు వి ♦ వేక విహీనత నూరబంది యా
త్మనుమధురాజ్యభక్ష్యములు ♦ మాని పురీషము కేగుచాడ్పునన్. 21

(భగవద్వాక్యము.)

సీ. వసుమతీనాథ యెవ్వనినిమోదనా కను
గ్రహబుద్ధి వొడమునా ఘనునివిత్త
మంతయు గ్రమమున నపహరించినవాడు
ధనహీనుడగుచు సంతాపమందు

విడుతురు బంధులవ్విధమున నొంటరి
యైచేయునది లేక యఖిలకార్య
భాగంబులుడిగి మద్భక్తులతో మైత్రి
నెఱపుచు విజ్ఞాన నిరతుఁడగుచు
గీ. బిదప వాఁడవ్వ యానంద ♦ పదమయాత్మ
బరగ శ్రీవిష్ణు లోక సం ♦ ప్రాప్తి నొందు
గాన మత్సేవ మిగుల దు ♦ ష్కరమటంచు
వదలిభజియింతు రితర దే ♦ వతల నెపుడు. 22

(భగవద్వాక్యము-భోజరాజీయములోనిది.)

ఉ. ఎవ్వఁడు నన్నుఁగోరి భజి ♦ యించుటకై మదిగాంక్ష సేయునే
నవ్విహితప్రియత్ను మది ♦ యాఱడిబోవ ననేకవిఘ్నముల్
నివ్వటిలంగఁజేసి యతఁ ♦ డిం గడు గాసిమొనర్తు నేమిటన్
నివ్వెఱపాటులేని చిర ♦ నిష్ఠ గనుంగొని యాదరింపుదున్. 23

)మాయాఖండననిరూపణము-శ్రీరామకృష్ణ పరమహంస చరిత్రిలోనిది.)

ఉ. ముందుగ రాముఁడు న్నడుమ ♦ భూసుత వెన్క-ను లక్ష్మణుండు నీ
చందముగా బ్రయాణమును ♦ సల్పుచు గానల కేగుచో మదిన్
గుందుచు లక్ష్మణుండు దన ♦ కు న్గనిపింపమి నగ్రజుండు సీ
తం దొలగంగ వేడుకొని ♦ తాఁగనియెన్ రఘురాము బిమ్మటన్. 24

ఆ. తే. మాయ యీశునకును ♦ మనజీవునకు నిట్లు
యడ్డమాట నతని ♦ యరయలేము
మాయదొలగు వెనుక ♦ నాయీశు విస్పష్ట
ముగను గాంచి ముక్తి ♦ బొందగలము. 25

(అపుత్రవిషయము-రాఘవ పాండవీయము.)

సీ. కులవర్ధనుండగు కొమరుఁగాంచని యట్టి
లాఘువాస్పదుని యాలయము లయము

సిరులకు దొడ్డవైన వరసుతు బడయని
ఘనకలుషాత్ము జీవనము వనము
పితరుల ఋణముదీర్చెడు సూనుఁ జెందని
దౌర్భాగ్యశీలు గోత్రమ్ము త్రమ్ము
రహి నిహపరసుఖ ప్రదు బుత్రు నెత్తని
వరపుణ్యహీను భవమ్ము వమ్ము
గీ. పలుబలుకులేల నిఖిలము ◆ ఫలము సూనె
యాత్మజులు లేని వారికో ◆ యతివ రమణి
తరమె యనపత్యులైవర్ణ్య ◆ మరయ నతని
యఖిలమును నిట్టి ముఖవర్ణ ◆ హాని జెంద. 26

(గృహస్థునకు పుత్రుడే ముఖ్యమనుట-శకుంతలాపరిణయములోనిది.)
సీ. కులము మేదినిమీద ఖిలముగాకుండఁగ
నభివృద్ధి కారణుం డాత్మజుండు
సౌఖ్యదంబైన సంసార ద్రుమంబున
కాలవాలస్కంధ మర్భకుండు
జంపతులకు హర్ష జలరాశియుబ్బింప
బూర్ణేందు బింబంబు పుత్రకుండు
గృహమేధి ధర్మ లక్ష్మికి వీఁపు మోపంగ
పెనుపైన యాధార భిత్తి సుతుఁడు
గీ. తనయుఁ డాలోకపథమున ◆ కనుపు వాఁడు
మందిరాంతర దీపంబు ◆ నందనుండు
సూనుఁ డిలువీటి బోకుండ ◆ సౌమ్య కర్త
యపర వయసున నాలంబ ◆ యష్టి కొడుకు. 27

(వనవర్ణన-చాటుపద్యము.)
సీ. కలికి యీ పిక వాక్యములు విన్న ముదుసళ్ళు
తమజవ్వనపు బను ల్దలచు కొనరె

చెలియ యీ తేటిపాటలు విన్న హరిదాసు
లంగనాదాసులై కెంగ గొనరె
పొలతి యీ పూలతావులు గన్న పెద్దలు
చిన్నలై మార్గంబు చెదరిపోరె
మెలతి యీ నెమలిమాటలు గన్న భార్యలు
రానివారగచాట్ల లోనబడరె
గీ. వెలది గోర్వంకపలుకులు ♦ వినిర మౌని
బ్రహ్మచారులు వేశ్యల ♦ వాలుగారె
కాంతయింకేల యిటువారి గట్టుమునులు
బల్మిమానితులపైబడి ♦ బట్టబోరె. 28

(తపోవనమహిమ—శకుంతలాపరిణయములోనిది.)

సీ. మునులు నిత్యస్నానములుదీర్చ యెడలక
కాసారమున కంచగదియ వెఱచు
మానిజనం బనుష్ఠానంబు దీర్చక
మృగశాబకము దర్భ మేయ వెఱచు
సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక
ప్రసవంబులను దేటి ముసర వెఱచు
బాలకాంక్షలు ఫలాహారతృప్తులుగాక
వనంబుపంటికి జేర వెఱచుఁ
గీ. దపసిజనములు నుతిమంత్ర ♦ జపములుడిగి
వచ్చియుండక పికశుకా ♦ వళ్ళములాది
యావనంబున గల విహంగమకులంబు
తత్తరమునొంది నోరువా ♦ యెత్త వెఱచు. 29

(పురుషునకు భార్యయెట్టిదనిన—దశావతారచరిత్రలోనిది.)

సీ. సంసారసాగరక్షయ దుఃఖవారాశి
దరియింపగాఁజేయు తరణితరుణి

హృదయంగమస్ఫూర్తి నెప్పుడునామోదంబు
గలిగించుతావి చెంగలువచెలువ
కామితఫలములు ఘటియించివేలుపు
ఱేడు బెంచినచెట్టు రెమ్మకొమ్మ
కందొగల్నిత్య వికాసమొందింపగా
మించిపున్నమ చందమామరామ

గీ. సదమణిమయదీపికా ♦ జ్వాలబాల
వల్లభమనోమదావళి ♦ వారినారి
శుభపరంపర వర్షించు ♦ సోనవాన
పఘులధర్మార్థ మణిగణపేటిబోటి. 30

(గృహస్థునకు భార్య ముఖ్యమనుట.)

సీ. అలసివచ్చినవేళ నడుగులొయ్యననొత్తి
విడెమిచ్చి సురటిచే విసరుటకును
నాకలుబడనీక యన్నపానంబుల
చేతబ్రొద్దున దృప్తిసేయుటకును
సంతరించినయట్టి సకలపదార్థముల్
దగులేలనింటిలో దాచుటకును
నతిథుల బంధుల నత్తమామల చిన్ని
శిశువుల దెలసి పోషించుటకును

గీ. ననవరత మగ్నిహోత్రంబు ♦ లరయుటకును
దేవపూజోపకరణము ♦ లీర్చుటకును
వల్లిపాల్పడ గృహకృత్య ♦ భరములేక
గృహియథేష్టంబుగా సుఖి ♦ యించు నెట్లు. 31

(కూతునకు తల్లిదండ్రులు జేయు హితోపదేశము-
(వరాహపురాణములోనిది.)

సీ. అత్తమామలు చెప్పినట్లు చేయుదుగాని
యెదిరి మారుత్తర మీకుమమ్మ

వలయు వేళల పెద్దవారుపంపక యెంత
పనికిబోనిండ్లకు జనకుమమ్మ
సకలబంధులకు బూసలలోని దారంబు
వలె సరాగంబున మెలగుమమ్మ
తోడికోడండ్రు వంతులకు బట్టినచోట
నుదరక తాలిమి నుండుమమ్మ
గీ. మానసంబున ధర్మమే ♦ మఱకుమమ్మ
నతికినెక్కిన నీసరి ♦ సతులలోన
వాసిగనుమమ్మ కులశీల ♦ వర్తనములు
గొంచపరపక మమువిచా ♦ రించుమమ్మ. 32

(శృంగారనైషధములోనిది.)

సీ. పాటించి కొలువుము భవనదైవంబుల
సవతుల గొనియాడు సఖులబోలె
నారాధనము జేయు నత్తమామల నెపుడు
పరిజనంబులమీద కరుణ నెరపు
యలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకు
తోడి కోడండ్రితోగూడి మెలగుచునుండు
దాసీజనముగోర్వు తల్లికరణి.
గీ. బ్రాహ్మణులయందు గురులందు ♦ బంధులందు
భక్తివిశ్వాస సౌహార్ద్ర ♦ పరత నెరపు
భవ్యపతి దేవతాచార ♦ పరమపుణ్య
ధర్మమేమరకుండు మీ ♦ తల్లి కాన. 33

(శకుంతలాపరిణయములోనిది.)

సీ. జీవితేశ్వరుబాసి చిరకాల వసతిగా
బుట్టినింటనె యున్కి బుద్ధిగాదు

పొరుఁగిండ్ల నిరుగిండ్ల బ్రొద్దుపోకలకైన
బలుమాఱు నడుగుట పాడిగాదు
దాసీజనులతోడి సరసముగాఁగూడి త్రి
ప్పరమూలలాడుట తగవుగాదు
తనకెంతయిష్టురాలైనను అన్యపురుషసం
సర్గంబు జేయుట జాడగాదు.
గీ. జనకగృహమున నైనను ♦ మనసు వచ్చి
కూరనారకు బంపుట ♦ గుణము గాదు
హాస్యకథలందు గీతవా ♦ ద్యములయందు
బ్రీతి నెఱపుట మగవారి ♦ రీతిగాదు. 34

(పరస్త్రీ సాంగత్యఫలము:- వారకాంతలోనిది)

సీ. మిత్రాప్తబంధుకళత్రపుత్రులచే పోటు
ధనజనాదరణ నిద్రలకుఁ జేటు
రోగముల్దగుల నల్గురిలోన నగుబాటు
తమ కులాచార పద్ధతికి లోటు
పరలోక సుఖదేహ బలవస్తులకు లోటు
చానమగడు విన్న చావు చేటు
పగవారు విన్నచో పలువురితో చాటు
జనపతిగన జెరనాల చేటు
గీ. పరసతుల పొత్తు గోరిన ♦ వారికిట్టి
గతులు గలుగక మానవు ♦ గాననిట్టి
చేష్టలను మాని భార్యల ♦ చెట్టబట్టి
నడచుటయె మేలు దుష్కృతి విడచిపెట్టి. 35

(వేశ్యాసాంగత్యఫలము.)

చ. తనసతి రోయుచుం గొఱగాటి, బుధపత్రికరంబుల దిట్టుచుండు, స
జ్జనులసతంబు దూష్యమును సల్పుటమూఢ ♦ లమోక్షలోకముల్

ఘనముగ చేరకుండుటది ♦ గాంచగ నాలుగు ద్రవ్యమంతయుం
వెనకయు ముందుజూడకను ♦ వృద్ధినిగల్గుట యైదు రోగముల్
గనుచు శరీరసౌఖ్యమును ♦ గాంచకయుండుట యారు ప్రాప్తమౌ
మనమున నించుకంత యును ♦ మానములేదిక వేశ్యగూడినన్. 36

(పరపురుష సాంగత్యఫలము-హంసవింశతిలోనిది.)

సీ. అత్తమామలుగన్న నారడి వృత్తురు
గావ పరీక్షింప నేవగించు
మఱఁదులు గాంచిన గఱకఱ నెంతురు
వదినలెఱింగిన వాసిచెడును
బంధువుల్ గనినచో బరగ నిందింతురు
తోడికోడలుచూడ నాడికొను
పతిగనుగొన్నచో బ్రాణహానియొనర్చు
నాఁడువారెఱిఁగిన వన్నెదఱుగు
గీ. నరకము విదిగాక యున్నిట ♦ నాఁడుపుట్టు
పుట్టుపాపంబు పుట్టిన ♦ బుట్టినింటి
కేనిమఱిసొచ్చి నింటికి ♦ గీర్తి-ఘనత
దేక యపకీర్తి దెత్తురే ♦ తెలుపలేచట. 37

(పతివ్రతాభిప్రాయము-విచిత్రరామాయణములోనిది.)

ఉ. నాథుఁడె బంధుఁడు న్గురువు నాథుఁడె మాతృ సహోదరాప్తులు
న్నాథుఁడె దైవముం ధనము నాథుఁడె మోక్షపదంబు నాథుఁడే
నాథుఁడె రక్షకుండు భువి నాతులకెల్లను గాన నా మనో
నాథుని సేవ సేవనము నమ్మితి కోర్కెలు ప్రాణవల్లభా. 38

(భార్యకు భర్త ముఖ్యమనుట-శకుంతలాపరిణయములోనిది.)

సీ. వనితకు నిష్టదైవము జీవితేశుండు
భామకు ముంగొంగు పసిడిభర్త
సుదతికి నఱలేని చుట్టంబు పెనిమిటి
తరుణికి ప్రాణమిత్త్రంబు ధవుడు
వనజలోచనకు బెట్టని కోటదయితుండు
నాతికి సకలార్థ దాతప్రియుడు
కాంతకు మానరక్షకు డింటియాతండు
సతికి నారడిలేని హితుడు వరుడు
గీ. కంబుకంఠికి నిత్య శృం ♦ గార విభవ
వల్లికకు నాలవాలంబు ♦ వల్లభుండు
పల్లవోష్ఠికి సౌభాగ్య ♦ భాగ్యలక్ష్మి
గణన మొనరింపనేల యే ♦ ద్దనయు మగడు. 39

(హరిశ్చంద్రోపాఖ్యానములోనిది.)

సీ. కుసుమకోమలులకు గుజ్జుమామిడిపండు
ప్రాణనాయకుపాద పద్మసేవ
శాతోదరుల కఱచేతి మాణిక్యంబు
ప్రాణనాయకుపాద పద్మసేవ
కీరవాణులకు ముంగిటిపెన్నిధానంబు
ప్రాణనాయకుపాద పద్మసేవ
కుటిలకుంతలులకు గొంగుబంగారంబు
ప్రాణనాయకుపాద పద్మసేవ
గీ. వలవ దేనోములును నోమ ♦ వనరుహాక్షు
లకు మనోహర పద కమ ♦ లంబులెపుడు
ముదముతోడ భజించిన ♦ నదియెచాలు
దలచిచూచిన నభిమతా ♦ ర్థంబులొసగు. 40

(వ్యభిచార స్త్రీ వర్ణన - భోజరాజీయము లోనిది.)

సీ. ఆవిప్రసుదతి యనాచారముల ప్రోక
యుగ్రకర్మంబుల యునికిపట్టు
దుర్గుణంబుల వెంట దుశ్శీలములకు తా
వవివేకముల కెల్ల నాస్పదంబు
కలహంబులకు మూలకందంబు కొంకుల
పుట్టపిల్లదముల పుట్టినిల్లు
క్రూరత్వముల చోటు కుటిలతపాలము లో
భంబుల నెలవు గర్వంబు యిక్క
గీ. యిరుగు పొరుగుల వారి నిం ♦ టింటి వారి
సూడుకొనదిట్టి మరి కాని ♦ కూడుగుడువ
దత్తివచ్చిన నొకపట్టె ♦ డశనమిడదు
కడగి బలియును భిక్షంబు ♦ గడుపుచుండు. 41

(హంసవింశతిలోనిది.)

చ. విటులకు గొంగుబంగరము, వేడుకగాండ్రకు బట్టుకొమ్మ, యు
త్కటతరమన్మథార్తులకు కల్పకుజంబు భుజంగకోటికిన్
ఘటితనిధానసీమ, యుపకాంతుల చేరువపంట, జార స
త్పటలికి బంచదారయును, దాని విలాస మయారె యారయన్. 42
గీ. మేలుకలువాలు గలనేలు ♦ మిసిమిగ్రోలు
కన్నుగవడాలు మరువాలు ♦ కరణిబోలు
మురిపముల ప్రోలు కలదొక్క ♦ ముద్దరాలు
వానియిల్లాలు దొమ్మరి ♦ వానిజోలు. 43
తే. అరవిరుల తేనె యచ్చాలు ♦ మరునివాలు
మిసమిసలప్రోలు వలరాజు ♦ మేటిడాలు

ముదిపముల మెచ్చుకొనజాలు ♦ ముద్దరాలు
వానియిల్లాలు దొమ్మరి ♦ వానిదోలు. 44

(తారకాంతలోనిది.)

సీ. తమ్మి జమ్మినపాణి నెమ్మి నమ్మినవేణి
కమ్మగ్రొమ్మినశ్రోణిగల్గుదాని
వలపులీనెడుతేట మొలపులీనెడుమాట
సొలపుబూనెడుపాట సొంపుదాని
విరులసొంపగుమేను సిరులపెంపగుకోను
సిరులనింపగుపీను చెల్వుదాని
మందరంబగు నడసింధురంబగుతొడ
బంధురంబగుమెడ బరగుదాని
గీ. మాటిమాటికి నొకపేటి ♦ వీటిపేటి
వాలు తనగోము కోటిని ♦ పటిమిాటి
సూటిగా నోటికిడుచుండ ♦ ఛేముతోటి
వాటిపొంబోటి విన్నవ ♦ ఘాటిజూచె. 45

(పురుషవర్ణన-వసుచరిత్రలోనిది)

సీ. తలిరుప్రాయమువాని నలరాజు నలరాజు
నలరాజు మెగడు సోయగమువాని
బసిడిచాయలవాని బగడంపు జగడంబు
జగడంబు గలమోవి సొగసువాని
వరుసచెక్కులవాని గులకెంపు పలుకెంపు
పలుకెంపు లొలయు నవ్వొలుకువాని
మెలికిచూపులవాని సిరిమించు దొరయించు
దొరయించు కాంచనాంబరమువాని

గీ. నౌరపు గలవాని మకుటకే • యూరహార
కటక కుండలచాక చ • క్యములవాని
నమ్మహాజాని గనిలేచి • యమిత వినయ
సంభ్రమముదోప నిలిచి ర • జ్జాత ముఖులు. 46

సీ. వాని కన్నులతేట వాని చల్లనిమాట
వాడాడు సయ్యాట వానిపాట
వానిముద్దు మొగంబు వాని కంబుగళంబు
వానిరొమ్ము దిటంబు వానిసొంబు
వాని వాతెరకావి వాని పెన్నెరితావి
వానిచక్కనిఠీవి వానియావి
వాని మూపులపొంగు వాని మేను మెరుంగు
వాని కౌను బెడంగు వానిరంగు
గీ. వాని మొగతీరుచూపులు • వానిసారు
వానివలపులదొరసాము • వానిగోము
వానిచేతల తగుమేల్మి • వానితాల్మి
పరులకెవ్వరికినిలేదు • మరపురాదు. 47

(తెల్లవారుఝామువర్ణన.)

సీ. కాలివాల్పిట్టల కలకలంబులు మీఱె
పగడకస్గలయొజ్జ బయలు దేఱె
నెలరాజు పశ్చిమా చలరాజముం జేరె
బలుచంద్రికాంతపు వెలలు పేరె
దారకాగణముల తళుకులెల్లడఁగాఱె
దీపంబులెల్లను తెల్లవాఱె
నతనుడు రేయెల్ల నని జేసి వేసారె
ధర వియోగుల పరితాపమాఱె

తిమిరంబుచే సొంపు సమసిన దిశలకు
వన్నియ నొసగు సౌవర్ణకరణి
గీ. మించు బీరెండ యగ్గిబు ♦ ట్టించునరణి
కలుషఘోర పయోరాశి ♦ గడపుతరణి
తోచెబ్రాచీమహీధరో ♦ త్తుంగ సరణి
బ్రాచమువు మానికంబుల ♦ బరణి తరణి. 50

(భాగవతము లోనిది.)

సీ. పౌలోమి తనబాలు పాన్పువైగనుపట్ట
పన్నినపవడంపు బంతియనగ
నాయురర్థముల వ్యయంబులో త్తిలిచాటు
కాలజాంఘికుచేతి ఘంటయనగ
ఘనజంతుజీవిత కాలరాసులవిధి
కొలువ నెత్తిన హేమకుంభమనగ
పశ్చిమ దిక్కాంత బరగగై సేయుచో
ముందట నిడుకున్న ముకురమనగ
గీ. శోకతాపోపశమదివ్య ♦ ఘుటికయనగ
పద్మినీకాంత నోముల ♦ ఫలమనంగ
మానుషమూర్త్తుల సారంపు ♦ ముద్రయనగ
మిహిరమండల ముదయాద్రి ♦ మీదనొప్పె. 51

(భోగరాజు నారాయణమూర్తిగారి కృష్ణాకుమారిలోనిది.)

చంద్రోదయం.

సీ. అవనిలోన ననాథలైన యనాథల
పాలిటబెను కాలపాశమనగ

పూర్వాపరాద్రులఁ బోల్పు గాఁగానిసురల్
గోలనియాడు పూట్బాలనంగ
నిశిదారసాని వెన్నెలగానుదాల్చిపై
బెట్టినమేటి టోపియనంగ
తలమువ్వఁగొను వేళ నలయింద్రరాణిచే
తండాల్పునట్టి యద్దంబనంగ
గీ. కాలమను నుపాధ్యాయుండు ♦ బాలురకు
అవని గుండ్రముగా నుండు ♦ ననుచు నిం
యనెడు నొకబల్లపై వ్రాసి ♦ యగుపఱచిన
యఖిలభూగోళమన జంద్రు ♦ డవతరించె. 52

(భాగవతములోనిది.)

సీ. ప్రాచీదిశాంగనా ఫాలతలంబున
దీపించు సింధూర తిలకమనఁగ
దర్పించివిరహుల ధైర్యవల్లులు ద్రెంప
దర్పకుండెత్తిన దాత్రమనగ
నలిగికాలకిరాతు డంధకారమృగంబు
ఖండింప మెఱయించు ఖడ్గమనగ
గగనతమాల వృక్షము తూర్పుకొమ్మను
లలితమై మెఱయు పల్లవమనంగ
గీ. దొగలు సంతసిల్ల ♦ దొంగలు భీతిల్ల
గడలిమిన్నుముట్ట ♦ కడలుకొనగ
బొడిచె శీతకరుడు ♦ భూరిచకోరక
ప్రీతికరుడుజార ♦ భీతికరుడు, 53

(భోజరాజీయములోనిది.)

సీ. కొండలెల్లను వెండి కొండబోలఁగ గామ
దమనుండు ప్రమథ బృందంబులెలువ
జలధులన్నియు దుగ్ధ జలధిబోలగ జక్రి
పాణియెచ్చటనైన బవ్వళింప
సతులందరును సరస్వతిబోలగను బ్రహ్మ
పంకించి మరితనభామ నెఱుఁగ
దంతులన్నియు నభ్రి దంతిబోలగవజ్రి
తనదంతి కంనువ దప్పితిరుగ
గీ. దెసలగలయఁబర్వి ♦ వసుమతి తలమెల్ల
నిండియాకసమున ♦ నివ్వటిల్లి
తారహారహీర ♦ ధవళమైచంద్రికా
జాలముల్లసిల్లె ♦ జగమునందు. 54

(చాటుధార)

సీ. అతడు గోపాలకుం డితడు భూపాలకుం
డెలమి నాతనికంటె నితడు ఘనుడు
అతడు కంసధ్వంసి యితడు పాపధ్వంసి
నెలమి నాతనికంటె నితడు ఘనుడు
అతడు యాదవపోషి యితడు యాచకపోషి
నెలమినాతనికంటె నితడుఘనుడు
అతడు పాండవపక్షు డితడు పండితరక్షు
డెలమినాతనికంటె నితడుఘనుడు
గీ. పల్లెకాంతల పట్టెణ ♦ ప్రభువితండు
స్త్రీలకాతండు పద్మసి ♦ స్త్రీలకితడు

సురలకాతండు నెలమిభూ ♦ సురులకితడు
కృష్ణుడాతడు శ్రీమహా ♦ కృష్ణుడితడు. 55

(చాటుధార)

సీ. ఆతడంబకు మగండితడమ్మకు మగం
డెలమినాతనికంటె నితడుఘనుడు
అతని కంటిని చిచ్చు యితనికంటిని బొచ్చు
నెలమినాతనికంటె నితడుఘనుడు
అతడెమ్మునక వేయు నితడు కొమ్మున వేయు
నెలమి నాతనికంటె నితడు ఘనుడు
అతడు శూలముద్రిప్ప నితడు వాలముద్రిప్ప
నెలమి నాతనికంటె నితడుఘనుడు
గీ. దంతయూతండు గోనెల ♦ మోతకితడు
పక్షుడాతండు ప్రజల సం ♦ రక్షుడితడు
దేవుడాతండు కుడితికి ♦ దేవుడితడు
పశువిభుడతండు నీతడు ♦ పశువిభుండు. 56

(వసంతకాలవర్ణన-కృష్ణామమారిలోనిది.)

సీ. మారిషుండై యుల్ల మరుదొప్ప మోహాంబు
ముందుగా నటియయి యందులోన
వరుస నహర్నిశల్ తెరలుగా రవిశశుల్
తెరలెత్తిదించు సేవకులుగాగ
కలకంఠరవము మంజులమైన శ్రుతిగాగ
ఖగపక్షములు మృదంగములుగాగ
విలసితారామసీమలు రంగములుగాగ
పాత్రలై నవవధూవరులు వరల

గీ. సర్వజగ మొక్క నాటకి ♦ శాలగాగ
సురలు చూపరుల్ గాగదా ♦ సూత్రధారు
డై ప్రదర్శించెను వసంతు ♦ డన్ని మొదల
నాటిదినముల శృంగార ♦ నాటకముల. 57

(సత్యప్రశంస-రసపుత్రవిజయములోనిది.)

సీ. వెలయాలి మొంగిలి పెదవులంటిన పంక్తకడనుండనొల్లక వెడలినావొ
కూటికినాశించి కూటసాక్ష్యములిచ్చు నోటిలోనుండక దాటినావొ
బలితంపుకలుకంపుపలువిప్పగనెగుప్పుమనభరింపగలేక యురగినావొ
పొగచుట్టకంపు సైపగలేక పగబూని ప్రాణముల్ తేపనిపారినావొ
గీ. సత్యదేవత నిన్నన ♦ జాలిపుట్టు
భరతఖండాన వేనవేల్ ♦ ప్రజలు లేరె
బ్రాహ్మణుల జిహ్వాలన్నియు ♦ పాడుబడెనె
నీకు నివసింప మెచ్చుట ♦ నెలవు లేదె. 58

(బిడ్డలయందు తల్లికుండు ప్రేమ-చాటుధార.)

సీ. ఇసుమంత సుతుడేడ్వ నిల్లుపైబడినప్పు
శిరముపై నాకాశ మొరగునప్పు
పిడుగు మొత్తినయప్పు కడలిపొంగినయప్పు
అగ్నిహోత్రుడు చుట్టు సలమునప్పు
పతితన్ను పిడనాడి పరులగూడినయప్పు
ముఖవార్తలు చెవి దూరినప్పు
దొంగలిల్లుజొచ్చి దోచుచున్నప్పు
విపజ్జనములు వెరపించునప్పు
గీ. కనుచుండని యూరడోళ ♦ మప్పుడుండదు
అయ్యొ నాయయ్య నాతండ్రి ♦ యయ్య నేను

చచ్చిపోవుదురాయుంచు ♦ సరగ నరుగ
మాతకు సమానమెవ్వరు ♦ మహి నిజూడ. 59

(సన్మార్గ దుర్మార్గుల ద్రవ్యవినియోగము-చాటుపద్యము)

చ. కడునతిలోభి ద్రవ్యమును ♦ కన్నపుదొంగకు బందెపోట్లకుఁ
పుడమిని వారకాంతలకు ♦ భూపతికిఁ జను సజ్జనుండు తా
వడసిన ద్రవ్యమంతయును ♦ బ్రాహ్మణకోటికి భక్తకోటికిఁ
గుడికిని సత్రశాలకును ♦ కూపతటాక వనప్రతిష్ఠకుఁ. 60

(అతిలోభివిషయము.)

చ. కరినరుఁడేసె పాముతని ♦ గర్చె నతండహిఁ గూల్చె గూల్చినఁ
కరినరపన్నగాదుల సృ ♦ గాలముగాంచి గజంబుమాసమా
నరుడు దశాహమూను రగ ♦ నాయకుఁడొక్కదినమ్ము నేటికిఁ
నరమును దిందునంచు నది ♦ నాశమునొందెను లోభియిట్లగుఁ 61

(కలియుగలక్షణము-జైమినిభారతములోనిది)

సీ. ఆమ్నాయపథవిహీనాచారములచేత ప్రబలునన్యోన్య వైరములచేత
నన్యాయవర్తను లైన రాజులచేత సమకొన్న దుర్వ్యసనములచేత
ధర్మపక్షనిరాదర కృత్యములచేత బ్రభవించు వేశ్యాభిరతులచేత
బరధనపరదార హరణబుద్ధులచేత నలమిన ఘోరమోహములచేత
గీ. జాలికాదులచేత దూ ♦ షకులచేత
బ్రిల్లదులచేత వంశనా ♦ శకులచేత
డాంబికులచేత బచ్చిబం ♦ డగులచేత
గల్లరులచేత దర్పించు ♦ గలియుగంబు. 62

(దశావతార చరిత్రములోనిది.)

సీ. క్షితిని ధర్మంబుమించిన లేదు వానలు
వానలు లేమి క్షామంబు బలియు

ఘ్రాణంబుబలిసిన గజచనునన్నంబు
భుజియింపదొరకమి బ్రిజలునోలి
యడవులబడి యాకుసలము మెక్కుచునవ్వ
జేసపూర్వంబుగా నున్నకాయ
పండుదిన్నను వాని బట్టుకయుదరంబు
చించి లోపలిది భక్షించికొనును
గీ. హ్రస్వదేహులు హీనాంగు ♦ లల్పధనులు
క్రూరులశక్తులై కతత్పరు ♦ లుత్కుటిలమతులు
రోగులన్యోన్య భక్షులౌ ♦ గారదూరు
లగుదురటమీద కలియుగాం ♦ త్యంబునందు. 63

(బ్రాహ్మణభక్తులే యుత్తములనుట - భాగవతము).

తలప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను
వేదవేత్తలు వేదవిదులకంటె
విలసిత వేదార్థవిదులువారలకంటె
సమధికశాస్త్ర సంశయముమాన్పు
మీమాంసకులు మఱి మీమాంసకులకంటె
నిజధర్మకర్మజ్ఞాన నిపుణులరయ
వారికంటెను సంగ వర్జిత చిత్తులు
దగవారికంటె సద్ధర్మపరులు.
గీ. ధార్మికులకంటె నుత్తమో ♦ త్తములు వినుము
మత్సమర్పిత సకల ధ ♦ ర్మస్వభావ
సుహితమములుగల్గి యితర ధ ♦ ర్మములు విడిచి
సమతవర్తించు సద్భాగ్య ♦ తముడు మనుజుడు. 64

(భగవద్వాక్యము-దశావతారచరితములోనిది.)

సీ. బహుజన్మముల సాధు పరిచర్య చేసిన
బుణ్యపురాణార్థములు నెఱుంగు
బుణ్యపురాణార్థములు నెఱింగిన యంత
సత్కర్మ మెప్పుడు సలుపుచుండు
సత్కర్మ మెప్పుడు సలుపుచునుండిన
మత్పాదభక్తి యాత్మనుజనించు
మత్పాదభక్తి యాత్మను జనించినమాత్ర
గొనసాగి జ్ఞానంబు కుదురుపడును
గీ. జ్ఞానము నపూర్వకర్మ సం ♦ చయములెల్ల
దీఱునప్పటికర్మము ♦ ద్వేషహితుల
కగును బ్రారబ్ధమనుభూత ♦ మగుచు దెగిన
జనుడు కైవల్య సామ్రాజ్య ♦ సౌఖ్యమొందు. 65

(జన్మపరిమితి-భర్తృహరిలోనిది.)

ఉ. ఆయువు నూరువత్సరము ♦ లందు సగంబు నశించు నిద్రచే
నాయరలో సగంబు గత ♦ మయ్యెడు బాల్యజరాప్రసక్తిచే
బాయక తక్కినట్టి సగ ♦ బాలుగతించు బ్రియాసవృత్తిచే
నాయువు చంచలంబగుట ♦ బ్రాణులకెట్లు సుఖంబు చేకుఱున్. 66

(శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదములోనిది.)

చ. అరయగ నూరువత్సరము ♦ లాయువటందురు మానవాళికిన్
హరువుగ బాల్యమందుననొ ♦ యౌవనమందునొ వార్ధకాననో
పురమున గాననంబుననొ ♦ భూరుహమగ్నిజలంబులందునో
మరణమె నిశ్చయంబుసుమి ♦ మానదుధాత్రిని బ్రాణికోటికిన్. 67

(సమీర కుమార విజయములోనిది.)

చ. చనియెదువేళ భోజనము ♦ సల్పెదువేళ శయించువేళ లే
చినయెడ కామినీరతి వ ♦ సించినవేళ కృతాంతుడీ జగ